# యక్షగానం

**- జి. కే**

హే... కృష్ణా ముకుందా.... మురారీ... అనే పాటను అల్లాహ్ అక్బరల్లాహ్... అనే నమాజుపాట ఇనపడకుండా జేసింది. ఆ ఎంటనే గంటమోగుతూ... నమాజును ఇనుపడకుండా జేసింది. సెర్బిల గంటేగుతంది. ఇంట్ల కూతకొచ్చిన కోడిపుంజు కూతనేర్చుకోటానికి తెగ ప్రయత్నం సేత్తునే కూస్తూ సగంలోని ఆపేత్తంది. సూరమ్మకు తెలివచ్చి లేలెమ్మని మాణిక్యాన్ని లేపింది. మాణిక్యానికి పిల్లలు పుట్టకపోతే సూరమ్మను కలిసిండు. మాణిక్యం మట్టిలోకి జారిపోయిన మంచి మాణిక్యమే మట్టిలోకి తనకు తాను జారలే, జారేటట్టు సేసింద్రు. మాణిక్యం లేవంగనే పక్కన బెట్టుకున్న బీడి కట్ట లోంచి బీడిదీసి కొసను కొంచెం కొరికి పారేసి అంటించిండు. నిండుగా ఉన్న తన జూలును వేషాలకోసం అందంగా పెంచుకొన్నాడు.బీడి తాగుతూనే బనీసు జేబులోంచి దువ్వెన తీసి ఆ జూలును దువ్వుకొని లేసిండు. లూజుగానున్న లుంగిని బిగించి కట్టిండు, కిందనున్న బనీసు తీసి తొడుకున్నడు. దండెం దగ్గరికొచ్చి బట్టల్లో చిక్కుకొని పోయిన కండువదీసి బుజానేసుకొని, మూలకు నిలబెట్టిన కట్టె పట్టుని, సరాంచుకుంట బయటకొచ్చిండు. అటు ఇటు జూసి మూలసుక్కను జూసి తెల్లారి నట్టేనని గుండె నిబ్బరం జేసికొన్నడు. తనుండేది పులివాడలో బెల్లంపల్లి ఎల్లమ్మ ఇల్లు. సానాపెద్దిల్లది,ఇంట్లో ఒక్కతే ముసలిదుంటది. ఆన్నుంచి గూడెం నడుమ నున్న ధరంబాయి దగ్గరికచ్చి ఎవరి దగ్గరికెల్లితె బాగుంటదని! జెర్రాలోసించిండు. మొదుగాలు మొదుగాల బిలాయ్ పోసయ్య ఇంటికెల్లాలని ఎర్రసట్టపోళ్లవాడకు నడిసిండు. ఆ గూడెంలో అందరు దాసారుపోళ్లే కాని ఒక్కొక్కరికి ఒక్కొక్క పేరు సార్థకమైంది. బిలాయ్‌కి పోయచ్చాడు గనక అన్ని బిలాయ్ పోసయ్య అంటారు. ఆడు ఆ వాడకు పెద్ద మనిషి . అంతా సిమ్మన సీకటి. కట్టె భూమ్మిద పొడుత్తున్న సప్పుడిని కుక్కలు మొరుగుతున్నయి. మాణిక్యం ముసలోడెమి కాదు. నడి వయస్కుడు ధైర్యవంతుడు. కుక్కలు మొరిగినా లెక్కచెయ్యకుండా పేట మధునని ఇల్లు దాటి సిటుకారి కొంరని ఇల్లు దాటి కనపడుతున్న పిల్లతోవోంటి బిలాయోని ఇంటికెల్లిండు. అని ఇంటి ముందటున్న జాలారిని కానక సరసర ఎల్లుతుంటే జాలట్లో కాలుపడి సర్రున జారింది."అన్నన్నన్న..." అని నిలదొక్కుకొని పడతాంటినె అనుకోంగనే జాలట్లో పక్కనున్న గొంతంతా ఒకటి సేసుకొని జైయ్యున మొరిగింది. ఒక్కదెబ్బకే తెలివచ్చిన బిలాయ్ పోసయ్య "ఆడియె ఆడియె నీయవ్వ తిన్నదరుగుత లేదే" ఇంట్లో నుంచే కుక్కను తిట్టిండు. ఎంటనే మాణిక్యం "ఓ పోసన్న నేను సింది మాణిక్యన్నచ్చిన, జెర ఇటేటు రాయె బాంచెన్" పిలిచిండు.

"ఏంది బిడ్డా గిప్పుడచ్చినవ్" అడిగిండు కడపకడ్డంగా పెట్టుకున్న గోనె సంచులతో కుట్టిన పరదను తొలగిస్తూ... వంగి మోకాళ్ల మీద చేతులు పెట్టి తొంగి చూసాడు. మాణిక్యం నెత్తిగొక్కుంట "ఇయ్యాల నా బెత్తెం సెపుతె పున్నెముంటదన్న..." అడిగిండు.

"సరె అయిందానికి బిడ్డా ఐదుగురు పెద్దమనుషలను కూడా పిలువు. ఏగిరంగా పిలుసుకురా!

నేను ఏడు గొట్టంగా ఊరికిబోవాలే" తొందర బెట్టిండు బిలాయ్ పోసిగాడు.

"సరె, సరె పోసన్న జెరనువ్వెక్కడికి బోకు దండం బెడత. సిడిమలో ఆల్లందరిని బిలుత్త. నువ్వయితే మొకం గడుక్కొని గా సర్కారు బాయికాడుండు." అనుకుంట ముత్తెనవాడకెల్లి ముత్తనెల్లన్ని, మడిపెల్లి వాడకెల్లి రాజీరన్ని, నల్లోల వాడకెల్లి బండారు కొంరన్ని, పులి లింగన్ని పొద్దుపొడిసే సరికి ఐదుగురిని బాయి దగ్గర సాపేసి కూసుండ వెట్టిండు. ఉల్లెంగల రాజిగాడు దున్నపోతుల పొలంకాడికి తోలుకొని పోతండు. ఆ దున్న పోతుల్లో ఒకటి సాపల గూసున్న పెద్దమనుషుల పక్కనే ఆగి ఉచ్చపోత్తంటే వాళ్లమీద సుక్కలు పడుతున్నాయి. అయినా వాళ్లు ఏమి

లెక్కసేయలె.

"ఇగ ఇండ్ల దాసుడేంది అడుగరాదుర నీయవ్వ" అని మడిపెల్లిరాజీరు వేపపుల్లతో పండ్లు తోముకుంట తుపుక్కున దున్నపోతుచ్చపోసె దిక్కు ఊంచిండు. సర్కారు బాయిదగ్గర గిరకల సప్పుడు మొదలయింది. నీళ్లెత్తుకెల్లటానికొక్కరె వస్తున్నారు. బాయిదగ్గరున్న ఇంటి ముందు పులిరామక్క మబ్బుతోటె లేసి అలుకు జల్లుతంది. మహెందర్‌రెడ్డి కైకిల్ల కూలీల కోసమచ్చి సెంబటుక పోయెటోల్లందరిని అడుగుతుండు.

"మల్ల కొత్తగా అడిగేదేంది గులాపు ........ పాతలెక్క లేదా" అని నిలుసున్న కనకడు జెర సిర్రుబుర్రులాడిండు.

చేతిలో తువ్వాల అటుఇటు తిప్పుతూ బరివాత ఉన్న ఒక పొల్లచ్చి బిలాయ్ పోశయ్య భుజం తట్టి "అవ్వరమ్మంటంది. దాయె" అని రెక్కబట్టింది. "అగు అయిపోయింది" బీడ్ల నాపుతూ పొగాకు నములుతూ తేపకు ముందు పక్కకు ఉంచుతున్నడు.

"ఏహె... ............... అంతా మీరే మాట్లాడవడితిరి. ఆన్నిమాట్లాడనియ్యర్రా" ముత్తనెల్లడు తన తెల్లనల్లని మీసాలు సరిజేసుకున్నడు.

ఇంతలో "జెరపక్కకు జరుగుండ్రి" మూడుబజార్ల కాన్నించి బతకడు కేకేసిండు. ఆ కేక విని మడిపెల్లి వాడనించి వచ్చె ఎడ్లకు తొవ్విచిండ్రు.

"అరె మాణిక్యం పొద్దెక్కుతందిరా ఈల్లకేడ పనిలేనట్టుంది, నువ్వు జెల్దిజెప్పరా" బిలాయ్ పోసిగాడు తొందర పెడుతూ ఇటుకలున్న దిక్కునడిసిండు. ఆ ఇటుకల పక్కనించే ఎర్రదుర్గడు. గంట రాజిగాడు, రోడు పోసిగాడు సెంబులు పట్టుకొని దొడ్డికి పోతండ్రు.

"నీ దండం పెడుత ఓ పోసన్న జెరరాయో. లేస్తివెందుకన్నా" పోసిగాన్ని పిలిసాడు మాణిక్యం.

"అవుతల బోలెడన్ని పన్లున్నయ్, ఈడ దీర్గిచ్చి కూసుంటే పన్లయితయా?" సూట్టానికచ్చిన ఈరస్వామి మొకం దిప్పుకునె.

"జెర కోపం జెయ్యకండ్రన్నా, తొందరపడితే ఎట్లన్నా" అని మొకన్ని దీనంగా పెట్టిన మానిక్యన్ని చూస్తూ "ఇండ్ల దాసేదేందిరా పోయినేడియ్యలేదా ఐదువందలు, ఇంటికడ్డెదు వడ్లు, ఇప్పుడుగదే

ఇచ్చేది. ఎక్కువంటే యాడదెత్తం" అని తేల్చేసిడు బండారి కొంరడు.

"గంతేరా మాణిక్యం" మని వంతపాడిండు పులి లింగడు సుట్ట సెంపలు లొట్టలు పోయే వరకు తాగుతూ వాళ్ల పక్కనించే ఇంతలో ఒకలెనుకొకలు పాలేర్లందరూ వెల్లుతున్నారు. కొందరు 'తాగం ఇంక తెగలేదా'' అని అడుగుతూ పోతండ్రు. వాళ్లనెత్తిమీద రుమాళ్లు, చేతిలో ముల్లుగట్టెలున్నాయి.

"గంతెరా మాణిక్యం అని తేల్చేసి, లేసిన పెద్ద మనుషులను జూస్తూ మాణిక్యం "మరి బలి సంగేతేందని" ప్రశ్నించాడు.

"బలి బలే ఐదుకతలు జెప్పు, బలిజెయ్యి, ఇగ అది తప్పుతదా? కతలు మా కోతలయినంకనే మొదలు వెట్టు" అని ఈరస్వామి జెప్పటంలో అందరూ ఇంటి మొకాన పోయిండ్రు తాగం తెగింది.



యాసంగి కోతలైపోయినై. మాణిక్యం టైయానికచ్చిండు. బుచ్చయ్య తాత సింతసెట్టు కింద కతలు జెప్పటానికి సిద్దమైండ్రు. ఆరు గుంజలు వాతిండ్రు. రంగు రంగుల టెంట్‌లాంటి పరద, ఆ గుంజల మీద కట్టి, నడుమ అడ్డంగా ఇంకో పరదాకట్టిండ్రు. ముందుభాగం స్టేజీ, ఎనుక భాగం సుతి పాడేవాళ్లకోసం. ఎర్రదానయ్య ఇంట్ల ఏషాలు గట్టిన పరదా దగ్గరికచ్చి వారి వారి ఇష్టదైవాన్ని ప్రార్థించుకొని ఆ తరువాతే ఏష ప్రవేశం చేస్తారు. మద్దెల, తాళాలు, గజ్జెలు కొట్టెటోళ్ళు, హార్మోన్యం వాయించేవాడు. ఇంకా రకరకాల వాయిద్యాలు వాయించుకుంట ఎనుకసుతి పాడేటోళ్లు సాపమీద కూసుండి ఉన్నారు. ముందు బుడ్రఖాన్ వచ్చి, ఇ కతలో నున్న పాత్రలను పరిచయం చేస్తూ తనను తాను సభికులకు పరిచయం చేసుకున్నాడు. కతలో ప్రధాన పాత్రధారి పరదా చాటునించి తన ఇష్టదైవాన్ని ప్రర్థించుకొని తెరవెనుక నించి "సేవకా" అని పిలిచాడు.

అది విని హాస్యగాడు "జీ....మారాజ్... సకల కళాకోవిదులు, సభికులు, ప్రేక్షకులు తమరాక కోసమై ఎదురుచూస్తూన్నారు. మారాజ్ దయచేయండి, దయచేయండి" అని ఆహ్వానించాడు. ఎదురు చూస్తున్న ప్రేక్షకులందరిచేత చప్పట్లు కొట్టిస్తుండగా రాజు పాట పాడుతూ ప్రవేశం చేసి "రాజ వంశీయుడురా.. రాజరాజ మారాజిత నందన, రాజవీజైభవ రాజ వైంశీయుడురా.. శ్రీశ్రీ..రాజ వంశీయుడరా.. తకతక దిమితక, తకిటదిం,తకిటదిం, తకిట తకిట, తకిట్తోం, తకిట్తోం...శ్రీరాజ వంశీయుడురా" అని నాట్యం చేయసాగాడు. తను పాడి ఆగాంతరువాత ఎనుకున్న వాళ్లు సుతి అందుకొని అదే పాటను పాడుతున్నారు. పాడటం అయిపోయిన తరువాత బుడ్రఖాన్ ప్రేక్షకులకు రాజును పరిచయం చేస్తాడు. అట్లాగే పాత్రలన్నింటిని పరిచయం చేస్తాడు. రాజుపోయిన తరువాత హాస్యం కొరకు గాని ఇంకో వేషం రావటనికి ముందుగాని, సమయానుకూలం కోసం గాని, హాస్యగాడు ప్రేక్షకులను తన ప్రతిభతో ఆశ్చర్యచకితులను చేస్తాడు. సమయ బావాన్ని పూరించటానికి పాటలను

పాడుటగాని, కతలు చేప్పుటగాని జరుగుతుంది. దాన్లో భాగంగానే రాజు తెరవెనక్కి పోయిన తరువాత స్టేజీ మీదికచ్చి

తానె తందనానా దిమ్‌దిమ్ రాజవందనానా ॥2॥
అరెరెరె...ఎక్కింది ఏందిరా, పెట్టింది ఏందిరా, కారేది ఏందిరా ॥2॥ ॥తాన॥
అహా...హా...ఎక్కింది తాడిసెట్టు ఓహో హో పెట్టింది లొట్టిరా... తకిటదీమ్
తా...తా...కా రే ది కల్లురా...రా...రా... ॥తా॥
అరెరె పొట్టోడు ఏందిరా...పొడుగటోడేందిరా...
ముడ్డి సుట్టు గజ్జెలున్న వాని పేరేందిర.... ॥తా॥
అరెరెరె.. పొట్టోడు ఉల్లిగడ్డ, ఒహో..హో..పొడగటోడు నెరుపకాయ
ముడ్డిసుట్టు గజ్జెలున్న వాని పేరంకాయ....య..య.. ॥తానె॥

ఇలా బూతుల్లా అనిపించే పొడుపుకతలు పాటలరూపంలో పొడుస్తూ తానే చక్కని సరియైన సమాధానాలిస్తూ ప్రేక్షకులను సంతోషంలో ముంచాడు.

దానిని వింటూ అందరూ కతలో నిమగ్నమయ్యారు.పక్కపొంటి మెండుగా ఎండలు కొడుతున్నా లెక్కచేయడంలేదెవ్వడు. ఉడుకు వడలు రయ్యమని ప్రేక్షకులను తాకి వెళ్లిపోతునాయి. వాటికి తట్టుకోక కొందరు తమ దగ్గరున్న కండువలను చెవులకు కట్టుకున్నారు. కూజలతో, పటులతో నీళ్ళు తెచ్చుకొని దగ్గర బెట్టుకొన్నారు. జనుముతో అల్లిన సంచులను,ఈత సాపలు తెచ్చుకొని వాటిమీద కూసున్నారు. కొందరు సెక్కపీటలు,నులుకతో అల్లిన పీటలు,కొందరు కట్టుడు రాళ్ళు తెచ్చుకొని వాటిమీద కూర్చున్నారు. కొంతమంది యువకులు గోడలమీద కూసుండి చూస్తున్నారు. లుంగీపంచె కట్టుకొన్న ఒక యువకుడు వేప ఎట్టెక్కి మొదటి పంగలో కూర్చుండి, అదే పంగమీద ఏటవాలుగా పండుకొని ఇంకొక యువకుడు చూస్తున్నాడు. ఎర్రసీమలు కుడుతున్నా గాని ఓ ముసల్ది దృష్టి పక్కకు పోనీవ్వటంలేదు. వడ్లు దంచే రోలుమీద ఓ ఇద్దరు కూర్చున్నారు. ముందు కూర్చున్న పిల్లల్లో కొందరు బరివాతనే ఉన్నారు. వాళ్ల పెయిలమీద తెల్లఅట్టుపేరిఉంది. చెరిగాన జుట్టు,సినిగిపోయిన బట్టలు, మసిగుడ్డల్లో కలిసిపోయినారు. మరికొందరు గోకుడులేసి గజ్జిని గోక్కుంటున్నారు. కొన్ని కుటుంబాలు ఒక్కదగ్గర కూర్చొని వింటున్నారు. అప్పుడప్పుడు ముచ్చటగా గుసగుసలు వెట్టుకొంటున్నారు. ముత్తెనెల్లయ్యలాంటి పెద్దమనుషులు నులకతో అల్లిన నాలుక్కాళ్లపీట మీద కూసున్నారు. కొందరు తమ కండువలను ముడికిందేసుకుని కిందనే కూసున్నారు.నాకు కత అక్కర్లేదని బిలాయ్ పోసయ్య బిడ్డ కింద వాలిన దువ్వెనను పడుతుంది. అది దొరకక ఇంకోచోట పోయి వాలుతంది. ఆ పిల్ల దువ్వెన పట్టుటకు బస్కీలు తీస్తుంటే అల్లంత దూరాన ఉడుత రెండు కాళ్లమీద కూసొని తనకే ఏదైన ప్రమాదము తలపెడుతున్నారేమో అన్నాట్టు గొడెక్కుతూ, దిగుతూ బెదురుగా చూసున్నది. ఉళ్లెనుండి అయిసుక్రేట్లు అమ్మోటోడు ఏనంగ వచ్చిండో ఎవరికి తెలియదుగాని, పోరగాండ్లు అని

సుట్టు చేరి కొనుక్కుటంద్రు. వాడు డబ్బాలోనించి ఒక్కొక్కటి ఒక్కొక్కరికి తీసి ఇస్తున్నాడు. ఇది మంచిగా లేదు. వద్దు అని మారాం చేసే పోరగాండ్లను కోపంగా చూస్తూ... తీసిన అయిస్ క్రేట్ని లోపలేసుకొని మరోటి తీసిస్తున్నాడు. వాడు కతను కూడా ఇంటున్నడు. మాసిన సినిగిన గుడ్డలతో ఓ పెద్దమనిషి వచ్చి పక్కనే ఉన్న పెంటకుప్పమీద  ఓ రాయేసుకుని కూసున్నాడు. రుమాల్లో దాసుకున్న సుట్టను దీసి, వేరొకడు తాగుతున్న సుట్టను అడుక్కొని తన సుట్టను అంటించుకొని నాలుగు బుక్కల పోగ గప్పుగప్పుమని వదిలి తిరిగి అతని సుట్టని అతనికిచ్చిండు. కారుతున్న సెమటను రుమాలుతో తుడుసుకుంట సుట్ట తాగుతూ కతవైపు దృష్టి పెట్టిండు. అతని వెనుకాలే ఓ జాలారి కాలువ ఉంది. దాని పొంటి కూడా నలుగురు కూసున్నారు. దానికి పగ్గంపెట్టు దూరంలో నున్న ఘంటరాజయ్య ఇంటి సూరునీడలో కూసుండి.  కొంతమంది కతనింటున్నారు. బండారి కొంరని గోడమీద కూసున్నారు. ఆ గోడలు ఇల్లు కట్టడానికనీ సగంలోనే ఒదిలేసిండు. ఆ గోడనానుకొని వేప చెట్టునీడన కొంతమంది వింటున్నారు. ఆ నీడకింద దంగురాజీరు, ఎడ్ల కచ్చురంమీద చాలామంది ఉన్నారు. ఎనుక భాగంలో కూసుంటే బరువు ఎక్కువై ఆది మిఠాయిలేస్తుంది.

గొంతు చించుకొని, రాగయుక్తంగా గళమెత్తి పాడుటవలన బఫూన్గొంతు బొంగుర్లు పోతంది. చట్టూ పదిపగ్గాలపెట్టు గట్టిగా గొంతెత్తి పాడుడాయే, కాని కిలోమీటరు దాకా వినపడుతుంది వాళ్లపాట, ఆ సంగతి వాళ్లకు  తెలియదు. గొంతు స్వరము తప్పినపుడల్లా లోనికెల్లి, తెచ్చుకున్న పరుపుదాటికల్లు ఒక గిలాస తాగి వస్తుండు బఫున్. తాగి వచ్చినపుడల్లా నిలువెత్తు హాస్యాన్ని కుమ్మరిస్తూ ప్రేక్షకులను తబ్బిబ్బు చేస్తున్నాడు.

రానోరి ఎల్లన్నా-రాజుగారు రమ్మన్నరట ॥రా॥
తిన్నంతా పెద్దడట-తిన్నకూలీ తీత్తడట ॥రా॥
బతుకంతా బజారు పాలట-శరీరమంతా బేజారు పాలట ॥రా॥
రొజంతా బండలు కొట్టుడేనట-ఎట్టిసాకిరి సచ్చిన దీరదట ॥రా॥
పప్పులోలె అప్పులెదుగునట-కొడుకులు తీర్చిన దీర్చిన దీరదట॥రా॥
సావుతిండి, పాసికల్లట-పచ్చనెత్తురు తుగుతాడట ॥రా॥
కథాక్రమంలో యుద్దం సంభవించిన ఏరాజైన చనిపోయినపుడు
దేవుడో జమదారుడా-మల్లైన్నడత్తవు నరుడో నరుడోనారాయణ.....
ఎండలోన ఎండినావు-వానలోన తడిసినావు
పక్క మనిషే నిన్ను పాడుజేసేనా ॥దే॥
భుజాన నేలను నిల్పే బలం నీది- కొండనైన పిండిగొట్టే బలం నీది
మిగిలింది మట్టి దిబ్బేనా నీకు ॥దే॥
విశ్వాసమే నీ ఇల్లాయె-మంచితనమే నీ పాణమాయె

మోడిసలహోలిచ్చినోళ్లె. మటుమాయం జేసిరా నిన్ను ॥దే॥
తెల్లగున్నయన్ని గోవుపాలన్నారా ॥దే॥
అరచేతిలో స్వర్గం చూయించి– గోముఖవ్యాగ్రమల్లె పొంచిచూసారో ॥దే॥
దేశాన్ని ముంచారు–దిబ్బెక్కి కూసున్నారు.
సచ్చిన నీ పేర సమాధులుగుట్ట, సందాలు వసూలుజేత్తంద్రు బిడ్డో ॥దే॥

కతక్రమంలో చదువు ప్రస్తావన వచ్చినపుడు

"ఐ సా ఎ స్నేక్, ఇన్ ది కాల్వ కట్టమే, బట్టె కొడుదునుగాని, దుడ్డు కర్ర నహీహై ఇన్‌మై హాత్" అని మూడు భాషలను కలిపి మాట్లాడి ప్రేక్షకులను ఆశ్చర్యంలో ముంచెత్తుతున్నాడు.

కత మంచి రసవత్తరంగా నడుత్తంది. ఊళ్లె నుండి అప్పడాలమ్మె శంకరయ్య అప్పాలు, మడుగులు, పేలాల ముద్దలు, మేదరి జల్లెడ గంపలో పట్టకొని వచ్చాడు. శంకరయ్య కూంటోడు. ఓచేత కట్టె ఓచేత గంప. బుజాన వడ్లు,జొన్నలు పోసుకోటానికి రెండు సంచులేసుకొని వచ్చిండు. ప్లాస్టిక్ బుగ్గను నములుతున్న పిల్లోడు శంకరయ్యను చూసి మందిలో నించి లేసి గిదగిద ఉరికి, తండ్రి పంచన సేరి, తండ్రికి శంకరయ్యను చూయించిండు!! "ససు కతిందామాగుర" అని ఎంతసెప్పిన ఇనుపించుకోక కొడుకు గారాబాన్ని ఒలుకబోసిండు. కతమనసున బట్టనియ్యలె... "నీ లత్కోరు మొహంల్లా సెప్పు, దొంగ లంజకొడక, కతనిననిత్తలేవు గదరా" లేసి చిరాగ్గానే శంకరయ్య దగ్గరకు తీసుకెల్లి రెండు పేలాల ముద్దలు గొనిచ్చిండు. ఇంతలో గుడాలమ్మే మల్లమ్మ వచ్చి "ఉవ్వో......" అని కేకేసింది. "ఓత్...నీయవ్వ ....... ఎవ్వతివె నువ్వు, ఎల్లు, ఈన్నించి ఎల్లు." అని ఓ పెద్ద మనిషి మల్లమ్మ పోయేవరకు పట్టుబట్టిండు. కత సురువు గాక ముందే వచ్చిన గుజ్జపు ఓదెవ్వ తాటి గడ్డలు అమ్ముడుపోయే దాకా కత దగ్గర్నుంచి కదల్లేదు. ఉల్లె నించే కారబండివాడు గంట కొట్టుకుంట మెల్లగా వస్తున్నాడు. వాన్ని గంటకొట్టకుమని ఓ పెద్దమనిషి హెచ్చరించడంతో వాడు గంట కొట్టడమాపివేసిండు.

ఎర్రకొంరని కొడుకు తాటిగడ్డలు తిసుకుంటనే, గుడాలు గావాలని గోలచేస్తూ కిందపడి పొర్లాడుతండు. లెమ్మంటే ఎంతకు లేవకపోతే తండ్రికి కోపమచ్చి "సరుపే అందుకుంటే నీ అవ్వ ఉచ్చపియ్యాకం పడాలె, లే రోత...... అని గద్దరిస్తూ వంగి పిలగాని చేతులు బట్టి లేపిండు. ప్రేక్షకుల్లో దంగురాజీరు పక్కన పడుకున్న కుక్కను కరవటానికి కోరపెల్లి లచ్చమ్మ కుక్క నాలుక బయటపెట్టి సొల్లుకక్కుతూ పండ్లు ఇకిలిస్తూ గుర్రుగుర్రుమంటుంది. "అడియె, ఎక్కన్నించి వచ్చినవే నీ పెన్నందెంగ,దీనెంబటే సత్తది" అని తన ఎర్ర తువ్వాలను పైకిగరేసిండు కొట్టినట్టు.

"....కళ్యామకాసింది, కళ్యామపూసింది కడగొట్టు సహదేవ నీకు నివాళి, శోభా శోభానమే లక్ష్మివైభోగం" అనే పాటతో కత సుఖాంతమైంది.

ఈ విధంగా ఐదుకతలు అయిపోయినై. ఇక మిగిలింది ఎల్లమ్మ తల్లికి బలివ్వాలి. ఎల్లమ్మ తల్లి

ఇంటింటికి తిరిగి కలికుండలో చేతులు ముంచిరావాలంటేఇండ్లన్ని శుభ్రంగా ఉండాలి. శుభ్రం చేయుటకు సైతాన్ వేషం కట్టిన జమాలు ఇల్లిల్లు తిరుక్కుంట, దుముపట్టి, పాతర బట్టిన సూర్లనన్ని సీపురుతో దులిపి, ఊడ్చి సాటతో ఎత్తిపారవేస్తున్నాడు. ఆ సైతాన్ను రెచ్చగొట్టి శుభ్రం చేయించుటకు డప్పు వాయిద్యాలు, కల్లుముంత ఎంబటే ఉంటాయి. డప్పులు ఎంత ఎగురుకుంట కొడితే అంతశుభ్రం, కల్లు ఎంత ఎక్కువ తాగిపిస్తే అంత తొందరగా పనులైతయని మాదిగల నమ్మకం. గూడెమంతా దులిపి ఊడిసే సరికి పోద్దునెత్తి మీదకచ్చింది. బలికోసం కొమ్ములు మెలికలు తిరిగిన పొట్టేలును పట్టుకొని ముత్తెనెల్లడు ధరంబాయి దగ్గరకచ్చి "నీ అమ్మపని గుద్దెనదెంగ. పొద్దంగవట్టె ఎవ్వడు రాడాయె ఎట్ల" అని తన బాధను వ్యక్తం చేస్తూ "ఓరి పోసిగో...." అని కేకేసిండు. కుడిసేతిలో పగ్గాన్ని సంకలపెట్టుకొని సుట్టలోనున్న నిప్పును కుడిసేతి బొటనవేలుడోరుతో లోపలికి నెట్టి. సెంపలు లొట్టలు పడేటట్లు పొగపీల్చి పెదవులను గుండ్రంగా చేసి సన్నగా పొగవదిలిండు. మల్లోసారి "ఓరిబండారి కోరింగో..." అని కేకేసి ధరంబాయిగద్దెమీద తనకండువేసి కూసున్నడు. పరుగో పరుగున అందరూ జమైండ్రు. చింది మాణిక్యంకూడా వచ్చిండు. "అరె ఏమైందిర మాణిక్యం ఇట్లుంటాదిరా. పొద్దుంగుతుంది ఇగ ఏషేమెప్పుడురా" బిలాయ్ పోసిగాడు కోపం జేస్తే...

"అయిపోయిందన్నా. వచ్చె..... మనమంతా ఆడికిపోదామని" మూడుబజార్లు చూయించిండు మాణిక్యం. అన్నన్న.... అంటూ లేస్తున్న ముత్తెనెల్లని మోకాల్లు సిటుకుసిటుకుమన్నాయి.సిన్న కొంరడు పారదెచ్చి మూడు బజార్లను సాపు జేత్తండు. ఎర్రదుర్గని జాలారి నించి, తోవ్వ మీదకత్తున్న నీళ్ళను కుప్పదిక్కు మర్రించి కుప్పను తవ్వుతున్ను కోణి చూసి "స్సో.... గటుబోరాదె గీన్నె ఉన్నదీనె" అని కోన్ని అటుదిక్కు కొట్టిండు.

కూసుండటానికి అనువుగా ఉండే బండలు జూసుకొని పంచెతో దానిమీదున్న దుమ్ము దులిపి మడిపెల్లి అంకూసు కూసున్నడు.బండారికొంరడు అతనింటి సూరికింద కూసున్నడు,అని పక్కకే పోయి ముత్తెనెల్లడు కూసున్నడు. ఊరకుక్క ఒకటి వచ్చి వాల్లుకూసున్న దగ్గర్నే గోడకు కాలులేపి రెండు మూడు బొట్ల ఉచ్చనడిపి దాని మానాన అది నాలుక బయట వేలాడేసుకొని పరుగువెట్టింది. వచ్చిన ఆ కుక్క కనుమరుగయ్యే వరకు బలికాబోతున్న గొర్రెపోతూ చెవులు కదలాడిస్తూ బెదిరిబెదిరి మెడలెత్తి చూసింది. నమ్మిన మనుషులు తనను ఇంకాసేపట్లో బలిచేసారనే భయమేలేని దానికి, విశ్వాసం గల ఆ కుక్కను సూడంగనే బయమచ్చింది. మూడు బజార్లను సపాయి సిన్నకొంరడు తన సపాయికట్టెతో ఊడ్సి సాపు చేసిండు. కొత్తసాట, ఆ సాట్లో అడ్డెడు బియ్యం, పసుపు, కుంకుమ తంగెడాకుతో తయారు చేసిన పచ్చబొట్టు,బియ్యపు పిండితో సేసిన తెల్లబొట్టు, ఊదుబస్తిలు కంకణాలు అన్నీ సిద్దంగా ఉన్నాయి. వాటితోపాటు ఒకే వేటుకు మెడను తెగనరికే కత్తి కూడా ఉంది. మూడుబజార్ల నట్టనడుమ ఒక గజం అందాద తడిపి అలుకేసిండ్రు. నాలుగు పక్కల ఒకే సైజు దబ్బగీసి, పట్నంవేసి, దీపాంత ముట్టించిండ్రు ఊదిబస్తిలు కూడా ముట్టించి బియ్యం పోసుంచి గిలాసలో సెక్కిండ్రు.

పట్నం మీద నాలుగు మూలలకు నాలుగు నిమ్మకాయలు నడుమ కొబ్బరికాయ దాన్ని కొట్టడానికి ఒక రాయిని కూడా కడిగి దానికి బొట్లు పెట్టింండ్రు.

ఇంతలో మాణిక్యని పెండ్లం ఎల్లమ్మ ఏషం కట్టి, కాలిగజ్జెలు గల్లుగల్లుమని మోగుతుండగ ఇనుప గజ్జెల తల్లి వచ్చినట్టు వస్తుంది. ముడ్డిసుట్టు గజ్జలే. బంతిపూల దండలు ఏసిండ్రు, ఎడమ సేతిలో సూలం తలుకు తలుకుమని మెరుస్తంది. మెరిసే కిరీటం, సేతిలో ఏప కొమ్మలు, ఎంటికలీరబోసుకొని, వెనక్కు ఇగ్గిపట్టే తాళ్లతో రెండు రెక్కలు కట్టబడి ఉన్నాయి. వెనుక నలుగురు మనుషులు పగ్గాలిగ్గిపట్టారు. అడుగెనుక అడుగు వేస్తూ మహాకన సొంపుగా వస్తంది. పిల్లలు సూత్తె భయపడతారని పిల్లల్ని బయటికిరానివ్వడం లేదు. ముందు డప్పుల వాయిద్యాలు మహాజోరుగా కొడుతున్నారు. ఆమె చుట్టు పెద్ద మనుషులుండి ఎవరు అడ్డం రాకుండా చూస్తున్నారు.

పట్నం దగ్గరికచ్చి కండ్లు మూసుకొని ఒక కేకేసింది. అది దేవతల కోసమని వాళ్ల నమ్మకం. ఏపకొమ్మలు పట్నం చుట్టు తిప్పుతూ తాను తిరిగింది. ఆ తరువాత మొక్కికొబ్బరికాయ కొట్టిండు మాణిక్యం. పట్నం కాడినించి ఎల్లమ్మ కదిలింది. తనకిష్టమైన ఇంట్లకుపోతది. ముందు ఎవరింట్లకు బోతె వాళ్లు అదృష్టవంతులని వారి నమ్మకం. పులి ఎల్లయ్య ఇంట్లకుపోయింది. ఆమె కోసం అందరూ పెద్దకుండలో కలిచేసి పెడతారు. పులి ఎల్లయ్య ఇంట్లో కూడా కలికుండ చేసి పెట్టారు. మెల్లగా వంగి రేకుల తలుపును వెనక్కితోసి తానొక్కతే లోపలికెళ్లింది. అటుఇటు చూసి పొయ్యి దగ్గరికెళ్లింది. మెల్లగా వంగి అక్కడున్న కలికుండలో చేయిబెట్టి అటుఇటు తిప్పింది. లేవబోయిన ఆమెకు పక్కనే వేలాడుతున్న ఉట్టి తగిలి కిరీటం తొనికింది. ఆమె వెంటనే కిరీటాన్ని ఎడమచేత్తో పట్టుకొని సర్దిచేసుకోటానికి చేయిని విదిలించింది. బయట తాళ్లు పట్టుకున్నోళ్లు తత్తరపడ్డారు. మెల్లగా ఎల్లమ్మ బయటకు వచ్చింది. ఇట్లా ఇండ్లన్నీ తిరిగి వచ్చేసరికి పొద్దు బారెడు కుంగింది. కాసేపు డప్పుల సప్పుడాగింది. పట్నం దగ్గరకు చేరుకున్న ఎల్లమ్మ ముందర గొర్రె పోతును నిలబెట్టి బొట్లు పెట్టింండ్రు. దానిమీద కల్లుబోసి బిడ్డా! సల్లంగ జెడితియ్యి అని తోళ్ల రాజిగాడు అతని రెండు గాళ్ల సందున గొర్రెను పెట్టుకొని దాని సెవులు సేతబట్టి, బెల్లంశాఖ దాన్నోట్లెబోసి తల్లీ ఎల్లమ్మతల్లీ మాగూడేన్ని సల్లంగ కాపాడుతానని సెలవియ్యి తల్లీ! అని గొర్రెనిడిసి రెండు చేతుల దండం పెట్టిండు. అందరూ గొర్రెదిక్కే సూత్తండ్రు. ఎపుడు జెడితిత్తదా అని రెప్పగొట్టకుండా సూత్తండ్రు. పదిమంది పదిమాటలు మాట్లాడుతనే ఉన్నరు. రాజీరుకు కోపమచ్చి ఆసె ఆ గండహ.. నీయమ్మ మాటల ..........., ఈడ గొర్రె జెడితిత్తలేదని మేము జత్తె మీరేమో మచ్చట్లు ....., అనికొంచెం గరమయిండు. 'అదెంతపనిరా... తల్లి తలుసుకుంటే ఇయ్యకపోద్దా! అంతా తల్లి సేతులున్నది. మనసేతులేమున్నది' అని బిలాయ్ పోసిగాడు సముదాయించిండు. అందరిచూపు గొర్రెమీదికచ్చింది. అందరు మొక్కండన్నా' మాణిక్యం చెప్పి పక్కకు జరిగిండు. సిందోళ్లు, మాదిగోళ్లంతా ఒకలెనుకొకలు మొక్కింండ్రు. సిన్న కొంరడు ప్రత్యేకంగా వచ్చి నీల్లు ఆరగించిండు. కర్రె పోసిగాడు వచ్చి, కల్లు, బెల్లంశాఖ గొర్రెమీద మరియు

గొర్రె గొంతుకల బోసి, తల్లీ నీబాంచెన్ మంచిగ జెడితియ్యమని మొక్కిండు, గొర్రెపోతు లొడలొడమని సెవులూపింది. గట్లయితే మేమాడింటం మొత్తం జెడితియ్యాలె' అని మాణిక్యమన్నడు చాలాసేపు ఎదిరిచూసినా గొర్రె జెడితియ్యలేదు. కల్లుశాఖ, బెల్లంశాఖ అయిపోవచ్చింది ఏం తక్కువ జేసినం బాంచెన్ సెప్పాలె నంటు ముత్తెనెల్లడు మొక్కిండు, కాసేపటికి ఎల్లమ్మ తల్లే గొర్రెవంక చూస్తూ ఒక్కసారి వేపకొమ్మలను బెల్లంశాఖలో మంచి గొర్రెమీద పూసింది. ఇక ఇస్తదని అందరికి నమ్మకం కుదురుతుండగనే ఒళ్లంతా మెడలతో సహా దులుపుకుంది. గొర్రె కన్నుమూసి తెరిసేంతలో డప్పులు కణకణ మోగాయి. గొర్రెతల తెగి కిందపడింది. ఎంటనే ఎల్లమ్మ ఒడుమాలబియ్యం దీసి రక్తంలో తడిపింగ్రు, బిలాయ్ పోసిగాడు గొర్రెతోలు తీసిండు. తోళ్లరాజిగాడు, మాణిక్యం మొకానికి పసుపురాసి తెల్లబొట్లు, పచ్చబొట్లు రక్తంతో వెట్టగా ఎంటనే మాణిక్యం కండ్లు ఎర్రబడ్డాయి. వేడివేడి దొబ్బదీసి మాణిక్యం నోట్లో గుక్కి పేగులు దీసి మెడనేసింగ్రు.

బొట్లన్ని మాణిక్యంమీద జల్లింగ్రు, ముడ్డిసుట్టు వేపాకులు గట్టింగ్రు కాలికి గజ్జెలు గట్టింగ్రు, బియ్యం సాట బుజాన పెట్టింగ్రు, డప్పుల మోత మోగుతూనే ఉంది. జనమంతా దాసుకున్న సారా పాకెట్లు తీసి ఒక్కొక్కటే తీసి ఓ మూల కొరికిపారేసి తాగుతున్నారు. తాగిన మైకంలో ఎగరటం మొదలయ్యింది. ఎగురుతున్న పులి అంకూసు, ఆ తరువాత ఈలలు కొడుతున్న యువకులు, తరువాత పెద్ద మనుషులు, నడుస్తున్నారు. చిన్నపిల్లలు అడ్డం రాకుండా చూస్తున్నారు. మాణిక్యం అవతారమే మారింది. నోరు తెరిసిన ఆది పరాశక్తిగా కొంతమందికి, పట్టువిడువని విక్రమార్కుడిలా కొంతమందికి తమ పాలిటి యముడులా కొందరికి కనిపిస్తున్నాడు. పెద్ద వాళ్లకు సైతం భయం గొల్పే విధంగా ఉన్నాడు. ఆపదలోనున్న వారిని ఆదుకొనుటకు వెళ్లుతున్నట్టు దబాదబా ఉరికినట్లే నడుచుకుంట ఒక్కొక్క పిడికెడు ఒక్కొక్క ఇల్లుమీద జల్లుకుంట వెళ్లుతున్నాడు. చిన్నదండులాగా మాదిగ గూడెం కదిలింది. రక్తంతో పసుపు కుంకుమలతో కలగలిసి ఉన్న బియ్యం ఇంటిమీద జల్లితే శుభం జరుగుతుందని ఆ గూడెం నమ్మకం. బండారి కొంరయ్య వేప చెట్టుమీద గూడు పెట్టిన గువ్వ పిల్లకు గుబులుబుట్టి, గుటగుటమని పరేసాన్‌గా జూత్తంది. పిడికిలి బియ్యం ఇసిరి కొంరయ్య ఇల్లుమీద గొట్టంగనే ఆ గువ్వపిల్ల రెపరెపమని ఎగిరిపోయింది.

సిటికారి కొంరయ్య ఇంటెనకకెల్లంగనే ఎవరో బలవంతంగా గుంజుతున్నట్టు ఒక్కసారిగా బిగుసుకుపోయిండు మాణిక్యం. ఒక్కపాదమే లేస్తంది, ఇంకో అడుగు భూమికి అతుక్కుపోయింది. ఊహూ.. నా... అని కండ్లు పెద్దయిజేసి కనుబొమలెగరేసి ముందుటకి అడుగేయబోతండు. పదిమంది పట్టి వెనుకకు గుంజుతున్నట్లుంది. లేసినడుగు లేసినట్లే ఉంది. ఎంత అడుగు ముందటికి వేద్దామన్నా అడుగు కదలటంలేదు. అందరికి ఒక్కసారి గుండె ఆగిపోయినంత పనైంది. ఓ అంటే, ఓ... అబ్బర పులంటే తోక బారెడన్నట్లు గొంతులు మోగుతున్నాయి. ఆడ తాతలనాటి సింత సెట్టుంది. అది కుంటిలింగయ్య అనే మాలోడిది. దానిమీద ఒక ఏల్పులమ్మ ఉందని అందరికి తెలుసు. అదే

ఆపుతుందని తెలుసు. ఎంటనే తన దగ్గరున్న కోడిపిల్లను కొరికిపారేసాడు బిలాయ్ పోసిగాడు. ఇటువంటివి జరుగుతాయని వారికి ముందే తెలుసు. అందుకే ఎవరి జాగర్తల వాళ్లున్నారు. ఆగిన చోటు ఎవరింటికి దగ్గర ఉంటే వాళ్లకుగాని, ఆ వాడకుగాని దరిద్రం పడుతుందని గూడెం నమ్మకం. మాలోల్లు అడ్డురాకుండా చూస్తున్నారు. పెద్ద మనుషులు. దయ్యాల రామనింటి దగ్గరికెళ్లంగనే మళ్లీ ఆగిపోయిండు. మేకలోదిగాడు గిదగిద ఉరికచ్చి నీళ్లారగిస్తే ముత్తెనెల్లడు ముందటికొచ్చి కర్రెకోన్ని కసుక్కున కొరికిపారేసిండు. పారేసిన కోడి రెపరెపమని కొట్టుకోటంతో ఆడ గుబురు సింతల్లనున్న గుడ్లగూబ ఒక్కసారిగా విదిలించుకొని బయటకు ఒర్రుకుంట ఎల్లిపోయింది. అందరూ దాన్ని తిడుతూ శని విరగడయి పోయిందని వారి వారి ఆత్మలు సంతృప్తి చేసుకొని ముందుకు నడిసారు. ఊరిని పట్టి పీడిస్తున్న తంతులు ఇంకెన్ని ఉన్నాయోనని ఎగురుతున్న పులి అంకుసు అనుమానం వ్యక్తం చేసాడు. ఆ గూడెం సుట్టు విపరీతమైన సెట్లు, కంకపొదలు, బండలు, రాళ్ళు, రప్పలు, చిన్నచిన్న గుంటలు, ఎనుగులు, ముండ్ల కంపలు, పిచ్చిచెట్లు, పెరండ్లు పెరండ్లలో పెట్టుకున్న చిన్న చిన్న దేవతల గుళ్లు మొదలగునవి ఉత్తరాన ఉన్నాయి. తూర్పున గొడ్లు గోసే జాగ. బొక్కలతో నిండిన తోళ్ల రాజిగాని సింత, ఆ సింత మీద గూడ జడల ఎర్రమైసమ్మ ఉంది. ఆ ఎర్ర మైసమ్మ రగతాన్ని జూస్తే ఇడిసి పెట్టదని అందరికి గుటగుటే ఉన్నది. రాల్లల్ల రప్పల్ల పడి ముండ్లనక ముతకనక నడుస్తున్నాడు మాణిక్యం. కాలుకు ముండ్లు ఇరిగినా లెక్క చేయటం లేదు. మొసచ్చినా, సెమటలు కారుతున్నా పరుగో పరుగున అందరూ నడుత్తుంటే ఇండ్లల్ల కుక్కలు మొరుగుతున్నాయి. కోళ్ళు బెదురుతూ అరుస్తున్నాయి. దొడ్లల్ల నున్న ఎడ్లు బర్లు కూడా బెదిరి బెదిరి చూస్తున్నాయి. దప్పు గొట్టే వాళ్లలో ఒకనికి ఒంటేలుకు వచ్చినట్టుంది. ఇంకొకనికి దప్పుకొట్టమనిచ్చిండు. వెంటనే ఒక్క తీరుగా కొడుతున్న దప్పులు సృతి తప్పాయి. ఏట్ ఏంకొట్టుడని పులి అంకుసు వేపకొమ్మలతో దప్పుకొట్టేవాళ్లను కొడుతండు. ఒంటేలుకు పోయినోడు పిచ్చిసెట్లల్ల కూసుండి వస్తుంటే కాలుకు పట్నంతుమ్మ ముల్లిరిగింది. మెల్లగా తీసుకుని కుంటుకుంటూ మందిలో సేరిండు. తోళ్ల రాజిగాని సింత దగ్గర జడలమైసి ఆపనే ఆపింది. దానికి ఎర్రకోడిసించి, గుడిమీద పోస్తేగాని తొవ్వ సాగనియ్యలేదు. మాణిక్యానికి జెకమొకరాయి కాలుకు కుచ్చుకుని రగతం కారినా లెక్కసేయక శరవేగంగా నడుస్తున్నాడు. మాదిగిండ్ల పంపును దాటి బొమ్మల్ల గడ్డ (బొందలగడ్డ) ను దాటి పట్నం తుమ్మ చెట్లను దాటి మూడుతాళ్లల్ల దగ్గరికొచ్చిండ్రు. అది చౌరస్తా. ఒకటి ఊళ్ళెకు బోయేదారి. ఒకటి మాల మాదిగలను విడదీసే రోడ్డు. ఇంకొకటి ఏరుగబోయేదారి, ఇంకొకటి వేరే పల్లెకు బోయేదారి. ఈ నాలుగు తోవల కాడ పెద్ద ఏల్పున్నదని అందరంటారు. ఆ పక్కనే పులివాడ, ఆ వాడ నీతి నిజాయితీకి ఇంకొక మెట్టు ఎక్కువ. మాదిగలకు హడల్ ఆ వాడంటే. ఆ వాడెనుకాలే ఏల్పున్నది. కాని అది చాలా మంచిదని మరికొందరి నమ్మకం. అక్కడ కూడా మాణిక్యం ఆగిపోతే పులి అంకూసు మాణిక్యం కాళ్ల దగ్గర కొబ్బరికాయ నేలకేసి కొట్టిండు. మాల మాదిగలను విడదీసే ఆ రోడ్డు గుండా ధరంబాయి

మీదుగా మూడు బజార్లకు సేరుకున్నారంతా, అందరి మొకాల్లో ఒక సంతృప్తిఉన్నట్టున్న గానీ నీరసించినట్లు కనపడుతున్నారు. పల్లేరు కాయల్లాంటివి అందరి గోసులకు, కాళ్లకు గుచ్చుకుని సీమల్లా పట్టుకొని ఉన్నాయి. వాటిని కూసుండి ఒక్కొక్కటి తీసుకుంటున్నారు కొందరు. కొందరు ఊపిరి పీల్చుకుంటున్నారు. కొంతమంది ఆయాసంతో నీళ్ళు తాగుతున్నారు. చాలామందికి తాగిన కళ్లంతా అరిగినట్లయింది. దాదాపు అందరి కండ్లు ఎర్రబడ్డాయి. మోకాలమీద సెమటను కొందరు తుడుసుకుంటున్నారు. కొందరు సెమటను లెక్కసేయటం లేదు. దాదాపు పెద్ద మనుషులంతా ముడ్డిమీద లుంగి పంచె, భుజంమీద కండువతోనే ఉన్నారు. ఆ కండువను అందరూ అప్పటివరకు నడుముకు కట్టే వుంచారు.

పట్నందగ్గర ఎల్లమ్మతల్లి అట్లాగే నిలబడి వున్నది. ఆమెమీద ఎండ కొడుతంది. గువ్వలు పగిలే ఎండతాటలు ఒలిసే వడ గాడ్పులను లెక్కసేయకుండా ఆవిడ అక్కడే నిలుసుండి ఉంది. ఆమె దగ్గర కొంతమంది కావలి కూడా ఉన్నారు. పట్నందగ్గర కారిన గొర్రె రగతం ఎండి నల్లబడి పోయింది. ఎండిన రగతానికి నల్లని గండుసీమలు పట్టి తింటున్నాయి. కొన్ని లైను కట్టి పట్టుకెళ్లుతున్నాయి. ఎల్లమ్మ సేతులున్న వేపకొమ్మలు ఆడి పోయినను, అందరూ అలసిపోయింద్రు. ఎపుడు ఇండ్లల్లకెల్లుదామా అని ఎదురు చూస్తున్నారు. డప్పుల మోతకూడా సన్నగించింది. పులి అంకూసు ఎగరటమాపి రొండిమీద కుడి చేయ్యేసుకుని నిలుసుండి సూత్తండు. అలిసిపోయిన మొకంతోనే పక్కనున్న వాన్ని జరిపి ముడిగపట్టి నోటితో తుపుక్కున ఊంచిండు. మల్లీ పక్కనున్నవాన్ని జరిపి నోట్లో ఉన్న పొగాకును కూడా ఊంచిండు. ఎల్లమ్మ ముందర నిలుసోని బెల్లంశాఖ, మాణిక్యానికి కల్లుశాఖ మొక్కి శాంతించమన్నడు. ఎనుక నిలుసున్నోల్లంతా శాంతించు శాంతించుమని వంతపాడింద్రు. ఎల్లమ్మ సేతులు పైకెత్తి ఈర్పులీరుస్తూ మూడు కేకలేసి నోరు తెరిసి మూడు సిటికేలేసి మామూలు స్థితికచ్చింది. మాణిక్యం నోట్లో దొబ్బనుతీసి పాతిపెట్టడానికుంచిన గుంటలోవేసి భద్రంగా సమాది చేసింద్రు. పేగులుదీసి తోళ్ల రాజయ్య బొక్కల పెంటదగ్గర నున్న మైసమ్మ గుడికి వేలాడదీసింద్రు. మాణిక్యం ముడ్డిసుట్టున్న వాడిపోయిన వేపకొమ్మలు దీసేసరికి మూడుసుట్లు తిరిగి ముడుసుకొని పడ్డడు. అప్పటికే తెచ్చిపెట్టిన రెండు కుండల నీళ్లు మాణిక్యం మీద బోసింద్రు. మెల్లగా మాణిక్యం లేసి సచ్చిలేసిన పీనుగోలె ఎల్లమ్మ ఎనుక నడుస్తూ తావు సేరుకున్నాడు. బలిచ్చిన గొర్రెను ఆరుపోగులేసుకుని తీసుకెల్లింద్రు పెద్ద మనుషులు.



ఉత్సాహమే గావచ్చు, లేక పోటీ తత్వమే గావచ్చు. లేదా ఈర్ష్యయే గావచ్చు లేకుంటే మీకంటే దేన్లో మేము దీసిపోమని గావచ్చు. కాకుంటే మిమ్ములను అడుక్కునేటోళ్లమీద మాక్కూడ దయుంటుందని చెప్పటానికి గావచ్చు. లేకపోతే పొద్దు గడవటం కోసం గావచ్చు, మాలోల్లు సిందివాళ్లతో యక్షగానం

ఏయించడం ఆశ్చర్యం వేసింది కొందరికి. సంతోషమైంది మరికొందరికి. బాలనాగమ్మ కథ మహాజోరుగా, రసవత్తరంగా నడిపిస్తున్నారు. అర్ధరాతిరైంది. గూడేం ఆసక్తితో మాయల పక్కీరు తంతులను సూత్తంర్రు. ఎవరి దృష్టిపక్కకు పోవడం లేదు. తొట్టిల పండబెట్టిన కొడుకునూపుతూ బాలనాగమ్మ సంతోషపడుతున్న సమయంలో మాయల పక్కీరు బిచ్చానికి వచ్చిండు. పకీరు వచ్చినట్టే ప్రేక్షకులెనుక దుమ్మురేపుతూ జీపు ఆగింది. దాని లైట్లు స్టేజిమీద పడి స్టేజీ వెలిగిపోతంది. బాలనాగమ్మ ఆ వెలుగును చూడలేకపోయింది. అందరూ చూస్తుండగానే బాలనాగు కర్రెకుక్కలా మారిపోయింది. మాయల పక్కీరు కుక్క మాయమైంది. వాళ్లతోపాటు సింది మచ్చయ్య నలుగురు మాదిగ యువకులూ మాయమైంర్రు. జీబు వెళ్లిపోయింది. కత ఆగిపోయింది. మాదిగ గూడెంలో ఏడుపు పాటలతో తెల్లారింది. అందరూ ధరంబాయి దగ్గర జమైంర్రు. మూగపోయిన పాటలు, దయా, జాలి, తరుక్కుపోయే గుండెల చప్పుళ్ళు, ఈ త్యాగం ఎవరికోసమో గాని తెల్లారి కలువల గుట్టమీద పీతిరి గద్దలాడుతున్నాయి. కన్న తల్లిదండ్రుల కండ్లనిండా ఇంకా నీల్లాడుతున్నాయి.

  